## గోలకొండపత్రికా ప్రచురములు

| | |
|---|---|
| ఉచ్ఛల విషాదనాటకము | 0-12-0 |
| కృష్ణార్జున సంవాదము | 0-6-0 |
| సంఘోద్ధరణ | 0-6-0 |
| కర్నూలురాజ వంశావళి | 0-3-0 |
| కృష్ణాలహరి | 0-1-0 |
| సుధాలహరి | 0-2-0 |
| బమ్మెరపోతనామాత్యవిజయము (హరికథ) | 0-1-6 |
| రఘునాథ | 0-1-0 |
| చారుమినారు | 0-1-0 |
| పంచముల చరిత్ర | 0-3-0 |
| హాలీకల్దారు జంత్రి | 0-2-0 |
| కార్డు కుబూలియ్యతులు 100 కి | 2-0-0 |
| ప్రాంసరీనోట్లు „ | 2-0-0 |

నోటు:—హిందువులపండుగల పత్రికలు ఖర్చైపోయినవి.

REG. No. N. 45

Reg. No. M. 2185

(STAMP)

Printed and published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad Editor K. Balakrishna Reddy